గ్రంథారంభము :—

శ్రీరస్తు.

శ్లో. అన్యోన్యాదర వీక్షణ విస్మృమర శృంగారసార సర్వస్వం
తేజఃపరం శివాఖ్యం చిర మవతా న్మాం పురాణదాంపత్యం.
వందిత్వా తన్మహా శ్చంద్రచూడ మానందమందిరం
కుర్వే కువలయానంద మకరందఝరీ మహం.
యద్య ప్యప్పయ సోమపీథికవిచంద్ర... ... ... ...
కిమిహా స్తి మే కువలయానందే తథా ప్యాదరాత్
యస్మిః కశ్చన కార్యఏవ సను తం యద్వైద్యనాథోదితా
వ్యత్య స్తీకురుతే దురధ్వకలనై ర్వ్యాఖ్యామిషా చ్చంద్రికా.

తథాహి.

చంద్రాలోకా త్కువలయానందో ఽభూదితి నాద్భుతః
పరం కువలయానందాచ్చం... ... ... ... ... ...

శ్లో. అతఏవ చకార వైద్యనాథో నిజకృత్యాహ్వవిపర్యయప్రమాదం
పరిహర్తు ముదారమూలరీతే ర్భత మన్యే విపరీతలేఖనాని.
తాని స్పష్టీకరిష్యంతే తత్ర తత్ర విభావ్యచ
విమత్సరం సహృదయా మాం నింద త్వథ నందతు.

అనఁగా కువలయానంద వ్యాఖ్యాతయగు వైద్యనాథసూరి విపరీతముగ వ్యాఖ్యానమొనర్చినాఁడు, ఆతని వ్యత్యాసముల నటనటఁ దెల్పెదను. సహృదయులు మాత్సర్యమువదలి పరికించి నిందించెదరుగాక; లేక ఆనందించెదరుగాక యని ప్రతిజ్ఞ సలిపినాఁడు.

శ్లో. సామాన్యలక్షణాన్వితమేవగ్రాహ్యం విశేషలక్ష్మ తతః
నక్వాత్యతి... ... ... ...లక్ష్మకించి ద త్రకృతం.
కావ్యప్రకాశముఖలక్షణ పారదృశ్వా
కల్యాణనవ్యబహుకావ్యవిధానచంచుః
సాహిత్యసారనిధి రప్పయదీక్షితీయ
వ్యాఖ్యా మిమాం కురలి రామకవి ర్విధత్తే.

ఈశ్లోక మీతఁడు, కవివతంసుఁడు సాహిత్యసారవేత్తయునని చాటుచున్నది. వ్యాఖ్యానరీతి దీనిని సమర్థించుచున్నది. 'చంద్రికా' ఖండన క్రమమును దెలుపుటకొఱకు కొన్ని వాక్యముల నీమకరందఝురినుండి యుదాహరించుచున్నాఁడను.

"వస్తుతస్తు-'విశేష్యేణ సహైకార్థ్యం భవేద్యత్ర విశేషణం
లింగసంఖ్యాదయః ప్రాయో విశేష్యస్థా విశేషణం."

ఇతికారికోక్తదిశా ఈశ్వరాదిపదానాం విశేషణవాచకత్వం విన్నా బుధాది పదసమానవిభక్తికత్వ... నావశ్యకత్వేన తదర్థమీశ్వరాది సదృశేలక్షణా. ఇవాది స్వార్థపర్యగ్రాహకః అన్యచబుధాదావభేదాన్వయ ఇతిరమణీయః పంథాః. అత్రకుతర్క-కర్క-శారణ్యశరణ్య చంద్రికాకారోక్త దూషణానామయ ముద్ధారక్రమః. యదుక్తమివాదేర్ద్యోతకత్వే ఉపమాయా... తత్వంభజ్యేతేతి తన్న. ఇవాదేర్ద్యోతకత్వంవాభవతు వాచకత్వం. ఉభయథాపినసమీహితహానిః. యత స్తత్ప్రయోగే ఉపమాశ్రౌతీత్యేవ ఆలంకారికసమయః. కించశ్రౌతత్వం న శ్రుతశబ్దవాచ్యత్వం. తథాసతి "మన్యేశంకే ధ్రువం నూనంప్రాయ ఇత్యేవమాదిభిః. ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దై రివశబ్దోఽపి తాదృశః" ఇతికారిక యోత్ప్రేక్షా వ్యంజకత్వేన పరిగణితా ప్రయోగేఽపి తస్యావాచ్యత్వ దార్ఢ్యేన సార్వత్రిక గమ్యత్వాపత్తిః" ఇత్యాది.

ఇట్టి యీవ్యాఖ్యాన మాలంకారికుల కత్యంతాదరణీయము.

## దశరూపకవర్త్మ.

కురలి రామకవి విరచితము. దశరూపకముల ప్రమేయమును సంక్షేపముగ నూటపది శ్లోకములందు వివరింపఁబడినది. ఈప్రతిసంఖ్య 4246. మూఁడు పత్రములలో నీగ్రంథ మిముడినది. పత్రములు క్రిమిదష్టములు. ఈప్రతియందు సిద్ధాంతకౌముదిలోఁ గొంతభాగము, లంబోదరప్రహసనము, ఉన్మత్తరాఘవమును వ్రాయఁబడినవి. మకరందఝురీ

కర్త్రయే దీనిని రచయించుటచేతను, రూపకలక్షణ గ్రంథములలో నూతన సమగుఁటచేతను నిటఁదెలుపఁ బ్రసక్తిగలిగినది.

గ్రంథారంభము.

శ్లో. అ...వ...గుణవారిధి మాన మ్యాత్మని సదాశివం దేవం
వ్యుత్పిత్సుముదే కథయతి దశరూపకవర్త్మ కురలి రామకవిః,
యద్యపి పూర్వై ర్వేత ద్వివృతం దశరూపకాదిషు తథాపి
వ్యుత్పిత్సూనా మస్మిన్ సుగమాయ పరం మమారంభః
సర్వైః ప్రతి...యస్యైః స్యై రభినయై స్స్ఫుటం
సభా... నేతృచారిత్రరూపణా ద్రూపకం మతం.

తుదిభాగము :—

సంహారస్యా త్ప్రశస్తిస్తు సభాశంసన మీరితం
దశో త్తరశతశ్లో కై ర్దాశరూపకపద్ధతిః.
దర్శితా సాధు కురలి కులక్షీరాంబుధీందునా
రామసంఖ్యావతా త్వర్థం ప్రీయతాం శంకరోఽనయా

రూపకక్రమము.

శ్రీరంగభూపాలవిరచితము. దశరూపకములకు లక్షణము దెలుపఁబడినది. రచయిత శ్రీరంగభూపాలుఁడు. తొలుత రూపకములయందుపయోగించు పరిభాషనునిరూపించి, ఆవెనుక నాటకాదిలక్షణములను దెలిపినాఁడు.

తుదిశ్లోకము.

ఇత్థం శ్రీరంగభూపేన లక్ష్యలక్షణశాలినా
సర్వలక్షణసంపూర్ణం లక్షితో రూపకక్రమః.

గద్య :—ఇతి శ్రీరంగభూపాలీయే నాటకాదిదశరూపకాణాం లక్షణం సంపూర్ణమ్.

దశరూపకాదులయందు నిరూపింపఁబడని కొన్నిలక్షణవిశేషముల నిందుఁగూర్చియున్నాఁడు. ఈతని కీరూపకలక్షణ నిరూపణమున

ప్రతిభావిశేషము గానవచ్చుచున్నది. ఏయేప్రకృతులం దెట్టి సంభాషణ ముచితమో యాయంశములను బాగుగవ్యక్తీకరించియున్నాఁడు. ఈప్రతిని 13 పత్రములుగలవు. వ్రాఁతమంచిది. పుటకాఱుపంక్తులు వ్రాయఁబడినవి. వ్రాఁతతీరు ముద్దులు గుల్కుచున్నది.

గ్రంథారంభము :—

అథ రూపకనిర్మాణ పరిజ్ఞానోపయోగినీ
శ్రీరంగధరణీశేన పరిభాషా నిరూప్యతే
తత్ర భాషా ద్విధా భాషా విభాషా చేతి భేదతః
చతుర్దశ విభాషాస్స్యుః ప్రాచ్యాద్యా వాక్యవృత్తయః
ఆసాం సంస్కారరాహిత్యా ద్వినియోగో న కథ్యతే
ఉత్తమాదిషు తద్దేశవ్యవహారా త్ప్రతీయతాం
భాషా ద్విధా సంస్కృతా చ ప్రాకృతా చేతిభేదతః.
కౌమారపాణినీయాదిసంస్కృతా సంస్కృతా మతా ఇత్యాది.

నడుమ నొకఘట్టము :—

కథానాథాస్తు ధర్మార్థరసమోక్షోపయోగినః
ధర్మోపయోగిన స్తత్ర యుధిష్ఠిర నళాదయః,
అర్థోపయోగి న స్తత్రనరసింహనృపాదయః
రసోపయోగినోవిద్యాధరవత్సేశ్వరాదయః
మోక్షోపయోగినో రామవాసుదేవాదయో మతాః.
కవయ స్తత్ప్రబంధార స్తే భవేయు శ్చతుర్విధాః
ఉదాత్త ఉద్ధతః ప్రౌఢో వినీత ఇతి భేదతః
అంతరూఢాభిమానోక్తి రుదాత్త ఇతి గీయతే
పరాపవాదా త్స్వోత్కర్ష వాదితోద్ధత ఉచ్యతే
యత్రో జితనిజోత్కర్ష వాదీ ప్రౌఢ ఇతీరితః

యుక్త్యా నిజోత్కర్ష వాదీ ప్రౌఢ ఇత్యపరైః స్మృతః
వినతో వినయోత్కర్షా త్స్వాపకర్ష ప్రకాశకః.

## అలంకారశిరోభూషణము.

ఇదియొక సంస్కృతాలంకారశాస్త్రగ్రంథము. ఆయలూరి కందాళార్యవిరచితము. ఈకవిదేశకాల చరిత్రాదికము కృత్యాదినిఁదెలుపఁబడినది. ఆవిషయమును క్రమముగ నుదాహరించెదను. ఉపలబ్ధమయిన యీప్రతియందు 11 పత్రములు ప్రథమోల్లాసమును, 12 పత్రములు ద్వితీయోల్లాసమును, 14 పత్రములు చతుర్థోల్లాసమును, 8 పత్రములు పంచమోల్లాసమును, 5 పత్రములు షష్ఠోల్లాసమును, 5 పత్రములు సప్తమోల్లాసమును గలవు. ప్రథమమున కృతిపతిపతివర్ణనము అక్షరగణాది వివేకమును, ద్వితీయమున కావ్యలక్షణము, చతుర్థమున రసనిరూపణమును, పంచమమున దోషములు, షష్ఠమున గుణములు, సప్తమమున శబ్దాలంకారములును నిందలి ప్రమేయము. దృశ్యకావ్యవివేచనముగల తృతీయోల్లాసము, అర్థాలంకారస్వరూపమునుదెల్పు అష్టమోల్లాసమును నిందు లుప్తములు. ప్రతిసంఖ్య 3441.

ఈతని యుల్లాసాంతగద్య:—

ఇతి శ్రీమత్సకలకల్యాణ గుణగణపరిపూర్ణ కృష్ణా తుంగభద్రామధ్యాధిష్ఠిత శ్రీబోరువెల్లినగర విహరమాణ శ్రీ కేశవస్వామి చరణనలినయుగల సేవాధురీణతాభిరామ సోమభూపతి సతీలలామ గిర్వమ్మాంబాగర్భ క్షీరపాథోనిధి సుధాకరాయమాణ శ్రీవేంకటాఖ్యోర్వీభృన్మహాస్థాన విద్వన్మహాకవినా కౌశికగోత్రతిలకేన శ్రీమదాయలూరార్యన్వయ సముద్భవేన కందాళయార్యేణ విరచితే అలంకారశిరోభూషణ నామ న్యలంకార శాస్త్రే ప్రథమోవిలాసః.

ఈకవివతంసుని యలంకారశాస్త్రపాండిత్యము మంచిదిగానే కానఁగును. ఇతరశాస్త్రప్రమేయమును నీతనికి గోచరముఁనట్టు లితని

రచన దెలుపుచున్నది. ఉదాహరణమునకై కొన్ని వాక్యములఁ జూపెదను.

శ్లో. శబ్దార్థౌ నిర్దోషౌ కావ్యం సగుణావలం క్రియావంతౌ” దోషరహితం గుణాలంకార వంతౌ శబ్దార్థౌ కావ్యమితి కావ్యసామాన్యలక్షణం. “నచ యః కౌమారహరస్స ఏవహివరస్తా ఏవచైత్రక్షపాః”...’ఇత్యాదా వవ్యాప్తిః. అలంకారశబ్దేన అలంకారాత్యంతానధికరణత్వస్య వివక్షితత్వాత్ అత్రాలంకార స్యాస్ఫుటత్వేఽపితత్సం భావనానపాయాస్తత్వాత్.నహ్యస్ఫుటత్వ మాత్రేణాభావ ఆపాద్యతే. తస్మాద్యథా కథంచి త్సాలంకారస్యైవ కావ్యత్వమితిసిద్ధం. నను కావ్యప్రకాశికాయాం, ‘తదదోషౌశబ్దార్థౌ సగుణావనలంకృతీపునః క్వాపి’. ఇతిక్వ చిదనలంకారస్యాపికావ్యత్వముక్తం,అతోవిరోధ ఇతిచేన్నైవం. అనలంకృతీ ఇత్యత్ర అనుదరా కన్యేత్యాదావివ ఈషదర్థకత్వస్య వివక్షితతయా ఉక్తార్థలాభాత్ -నచ నఞః ఈషదర్థకత్వ మప్రామాణికమితి వాచ్యం ‘తత్సాదృశ్యమభావశ్చతదన్యత్వం తదల్పతా. అప్రాశస్త్యంవిరోధశ్చ నఞర్థాః షట్ప్రకీర్తితాః”

ఇతి వచనస్యైవ ప్రమాణత్వాత్ :—

లక్షణములను లక్ష్యములను స్వయముగ రచియించియున్నాఁడు. రంగేశున కంకితముఁ జేసినశ్లోకములను దాహృతులకుఁ గైకొనియున్నాఁడు. కవితాధారయు సరసముగనే యున్నది.

తెలుఁగు ప్రబంధములయందలి కృత్యాదిపద్యముల తీ రెట్లుండునో యీయలంకారగ్రంథమునందలి యుపక్రమ మట్లేయున్నది. విస్తృతమైనను పాఠకులకీక్రమమును దెలియఁజేయఁ గుతూహలినై ప్రదర్శించుచున్నాఁడను. ఈప్రసంగమునఁ గృతికర్తృ కృతిభర్తలనుఁ గూర్చి కృత్స్నముగఁ దెలియఁగలదు.

కృత్యాది :—

శ్లో. కందాళ దొడ్డయాచార్యచరణౌ శరణం వృణే
యన్నతౌ కవితాగంగాలహరీ విహరిష్యతి.
అతిశయోఽస్తి మంహాంశ్చమహాగురో
శ్చరణయో రసయో స్సరసీరుహాత్
భవతి తత్స్వయమేవ గృహంశ్రియః
పరమి...తనుత స్స్వసమాశ్రితాన్.
సకలజనాంతర్యామీ సదృశవయోరూపగోపికాగామీ
కలయతు కమలాకామీ కరుణాం మయి భూరి కేశవస్వామీ.
జయతి కిల కులం తజ్జన్మ యస్యావిరాసీ
త్పరమపురుషపాదే బ్రహ్మరుద్రాదిపూజ్యే
సురమునిగణసేవ్యా సోదరీ యస్య గంగా
క్షితిరపి సుపవిత్రా క్షేమదా ప్రాణభాజాం.
తస్మి న్నార్కృషీవలం వర్ణం సువర్ణమివ శుశ్రుమ
వర్ణోత్కృష్టశ్చ కుత్రాపి పాకాతిశయతః పరం.
దేశోఽపి పాకనాడీతి విఖ్యాతో లోకపుణ్యపరిపాకాత్
తత్ర మిటిమిల్లగోత్రం ప్రాప్తమభూ ద్భూరిగోత్రరాజత్వం.
తస్య మిట్మిల్లగోత్రస్య మహిమా వాగగోచరః
యత్ర శ్రీవేంకటక్ష్మా భృన్ముఖా జాతా మహీభృతః.
దేవాభూవలయే జనౌచనిరతాః పుణ్యైరగణ్యైస్స్థితాం
కర్తుం స్వస్వపదస్థితిం విధి ముపేత్యాభ్యర్థయన్ స్వాన్స్వయం
తత్సంగృహ్యాకు - సోపి సకలం సారం యతోముష్టినా
యద్వంశం వ్యతనో త్స భాతి వితరాం తన్ముష్టిపల్ల్యాఖ్యయా
ఇత్యాది.

# లక్షణదీపిక - గౌరన.

వ్యాకరణవిద్యాప్రవీణ, విద్వాన్, చిలుకూరి పాపయ్యశాస్త్రి.

ఆంధ్రమున 'హరిశ్చంద్రచరిత్రము, నవనాథచరిత్రము' అను సుప్రసిద్ధములయిన ద్విపదకావ్యములను రచియించిన గౌరనయే యీ 'లక్షణదీపిక' అను సంస్కృతచ్ఛందోగ్రంథమును రచియించిన కవివరేణ్యుఁడు. ఈతఁడు తొలుత నీలక్షణదీపికను, ఆవెనుక హరిశ్చంద్రచరిత్రమును, పిమ్మట నవనాథచరిత్రమును రచియించిన ట్లీక్రింది వాక్యముల వలనఁ దెలియుచున్నది.

హరిశ్చంద్రచరిత్రము ప్రారంభమున "సరససాహిత్యలక్షణవిచక్షణుఁడ" అనియు, తుదిని

"భ్రమరాంబప్రసాదసంప్రాప్తకవిత్వ
సుమహితసామ్రాజ్యసుఖపరాయణుఁడు
చతురసాహిత్యలక్షణచక్రవర్తి"

అని తన్నుఁగూర్చి యీతఁడు తెలుపుకొనియున్నాఁడు. వివిధసాహిత్యగ్రంథములందలి ప్రయోగములతోఁగూడిన యీలక్షణగ్రంథనిర్మాణముననే యీతని కిట్టి లక్షణచక్రవర్తిత్వము స్థిరపడియుండు ననుట నిర్వివాదము.

ఇఁక నవనాథచరిత్రారంభమున—

"ఇప్పుడుగల సుకవీంద్రులలోన
సరససాహిత్యలక్షణవివేకముల
సురుచిరమధురవచోవిలాసముల
గుణశీలములను సద్గుణకలాపముల
నలవడ్డవాఁ డెవ్వఁడని విచారించి"

తన్ను రావించెనని తెలిపెను. ఇట్లనుటచే నవనాథచరిత్రమును నిర్మించునాఁటి కీతనికి లక్షణదక్షతయు సురుచిరకావ్యనిర్మాణచాతురియు

నలవడినట్లు విదితమగుటచే నట్టి ప్రసిద్ధి సుప్రసిద్ధహరిశ్చంద్రచరిత్రమును రచించుటవలననే కలిగియుండె ననుకొనవచ్చును. కావున నుపలబ్ధమై నంతవఱకు గౌరనకృతులలోఁ దుది గ్రంథము నవనాథచరిత్రమును, తొలుతటిది లక్షణదీపిక యనియు మనము దెలిసికొన ననువగుచున్నది.

నేఁటివఱ కీలక్షణదీపిక ముద్రితముగాలేదు. విమర్శకు లందఱు నిందలివిషయముల నుదాహరించునపుడు వ్రాఁతప్రతుల నూఁతగఁ గొని యున్నారు. గౌరనకాలనిర్ణయాదికమున కీగ్రంథము మిక్కిలి తోడ్పడు నదిగ నున్నది. అవిషయమును గ్రమముగఁ దెలిపెదను. కాని ముందుగ గ్రంథమాతృకలనుగూర్చి కొంత వివరించెదను.

ఝరిమద్భాండాగారమున 'లక్షణదీపిక' తాటియాకుప్రతులు రెండు గలవు. అం దొకటి 2585 సంఖ్యగలది. రెండవది 1391 సంఖ్యగలది. రెండును సమగ్రములే. ఇందలివిషయములను దెలుపునపుడు క్రమముగ వీనిని 'క' 'గ' ప్రతులని వ్యవహరింతును. ఈప్రతులందలివిషయములకుఁ బోలికలు మార్పులు పెక్కులు గలవు.

## రెంటికిఁ గలపోలికలు.

1. శ్లో. ఏషా లక్షణదీపికా విజయతే విద్వజ్జనానన్దినీ
ఛన్దోఽలంకరణాద్యనేకవివిధగ్రంథప్రయోగాన్వితా
గర్వాఖర్వకుతర్కకర్కశకవిగ్రీవాస్పదా సంశ్రిత
వ్యాళీ సత్కవిరాజకల్పలతికా కల్పాంతరస్థాయినీ.
అను నీశ్లోకము తుదిని రెండిటను గలదు.
2. లక్షణస్వరూపమును దెలుపు వాక్యములును, ఉదాహరణశ్లోకములును గొన్నిపట్టుల రెండిట నొకరీతిగనున్నవి.
3. రెండిటఁ జేర్కొనిన లక్షణగ్రంథములు కొన్ని తుల్యముగ నున్నవి.
4. చాలవఱకు ఛందోవిషయములు సమముగ నున్నవి.
5. లక్షణస్వరూపనిర్ణయము రెండిట సంస్కృతభాషయం దున్నది.

## రెండిటికిఁ గలభేదములు.

1. ఉపక్రమోపసంహారములు వేర్వేఱుగఁ గన్పట్టుచున్నవి. అనఁగా 'క' ప్రతికిఁ బ్రారంభమున

శ్లో. జానకీముఖపద్మార్కం జానకీకుచభూషణం
జానకీరమణం వందే జగతాం మంగళప్రదం.
వందే వామ స్తనన్య స్తవల్లకీవాదనోత్సుకాం
వక్త్రాబ్జవాసనాలోలభృంగిసంగీతమాతృకాం.
అస్తి ప్రశస్తావనిపాలమౌళి
రత్నావళీరంజితపాదపీఠః
రేచర్లవంశాన్వయపూర్ణచంద్రో
మహాబల స్సింగయమాధవేంద్రః.
ఆసీ త్తస్య మహామాత్యః స్వామికార్యధురంధరః
పోతరాజ ఇతి ఖ్యాతో రాజనీతియుగంధరః.
మంత్రిచూడామణే స్తస్య సోదర స్యాయ్యలుప్రభోః
గారనార్య ఇతి ఖ్యాత స్తనయో నయకోవిదః.
సోఽహం సోమకళామౌళిప్రసాదా ద్గతకల్మషః
ప్రణమ్య పింగళం నామ కవిపుంగవ ముత్తమం.
ఉదాహరణరత్నాని లక్షణగ్రంథసింధుషు
సమాకృష్య సతాం భూత్యై ప్రవక్ష్యే లక్షణదీపికామ్.

అని కలదు.

'గ' ప్రతికిఁ బ్రారంభమున

"శ్లో. ప్రణమ్య విద్వజ్జనపారిజాతం
కవీంద్రవిప్రార్చితపాదపంకజమ్
విభుం ప్రభుం విశ్వసృజం మహేశమ్
సంవక్ష్యతే లక్షణదీపికేయమ్.

అస్య,గద్యపద్యప్రబంధానాం ఛందోలక్షణనియామకస్య గ్రంథ స్యాదా తావ త్ప్రకారః కథ్యతే.” అని కలదు.

‘క’ ప్రతికిఁ దుదిని—

“ఇతిలక్షణదీపికాయాం ప్రబంధలక్షణం సంపూర్ణమ్” అని కలదు.

‘గ’ ప్రతికి తుదిని—

“ఇతిశ్రీతరణవిజితవినుతపారిజాత పోతనామాత్యసహజాత చాతుర్యధుర్య శ్రీమదయ్యలుమంత్రిశేఖరగర్భరత్నాకర రాకాసుధాకర గౌరనార్యవిరచితాయాం లక్షణదీపికాయాం మాతృకాపూజావిధానంనామ పంచమః పరిచ్ఛేదః” అని కలదు. ఇట్టిగద్య లీప్రతిలో ప్రతిపరిచ్ఛేదము తుదినిఁగూడఁ గలవు.

2. ‘క’ ప్రతియందు పండ్రెండు ప్రకాశములు.

‘గ’ ప్రతియం దైదు పరిచ్ఛేదములు.

3. ‘క’ ప్రతిలో ప్రకాశములతుదినున్నగద్యములవలనఁ గవివంశాదికమునుగూర్చి తెలియకున్నను, ప్రారంభమునందలి శ్లోకములవలనఁ నవి తెలియుచున్నది.

‘గ’ ప్రతిలో గ్రంథారంభమునఁ గవివంశాదికము వర్ణింపఁబడకున్నను, పరిచ్ఛేదాంతగద్యములవలన నాయంశము దృఢముగ విశదమగుచున్నది.

4. ‘క’ ప్రతిలో సంస్కృతసాహిత్యచ్ఛందోగ్రంథములు మాత్ర ముదాహరింపఁబడినవి.

‘గ’ ప్రతిలో సంస్కృతాంధ్రచ్ఛందోగ్రంథములు రెండును నుదాహరింపఁబడినవి.

5. ‘క’ ప్రతిలో వర్ణోత్పత్తిమొదలుగ మాతృకాపూజనాంతముగల ఛందోలక్షణములును, ఉదాహరణాదిప్రబంధలక్షణములును వర్ణితములు.

ఆక్రమ మిట్లున్నది.

శ్లో. వర్ణానా ముద్భవః పశ్చాత్ వ్యక్తి స్సంఖ్యా తతః పరం
భూతబీజప్రచారశ్చ తతో వర్ణగ్రహావపి
అనర్హానర్హా వేధశ్చ రూక్షస్నిగ్ధవిచారణా
ప్రయోగనిర్ణయ స్తేషాం శుభాశుభ ఫలానిచ
గణానాం చాభిధానాని స్వరూపా ణ్యధిదేవతా
వర్ణ వేధగ్రహా స్తద్వ చ్ఛుభాశుభ ఫలానిచ
మిత్రామిత్రవిచారశ్చ నక్షత్రాణిచ రాశయః
మృతవేలగ్రహావస్థా మాతృకాపూజనాక్రమః
కర్తుః కారయితుశ్చైవ ప్రబంధానాం చ లక్షణం
వక్ష్యతే తత్ర సకలం మయా లక్షణవేదినా.

'గ' ప్రతిలో వర్ణోత్పత్త్యాది మాతృకాపూజనాంతలక్షణము మాత్రము వర్ణితము.

ఇట్టిప్రతులు రెండును విషయప్రతిపాదనమునఁ గొంతసామ్యమును గొంతమార్పును గలిగియున్నవి. ఎట్లయిన రెండిటిని గూడ రచియించినయాతఁడు 'గౌరన' యనియే చెప్పనగును.

ఇఁక మానవల్లి రామకృష్ణకవి, ఎమ్. ఏ. గారు శ్రీరంగమహాత్త్వము (భైరవకవివిరచితము) పీఠికలో నిట్లు తెలిపియున్నారు. "గౌరన లక్షణదీపికలోఁ గవిగజాంకుశమునుండి నాల్గు లాంధ్రము లుదాహరించెను. పుత్తురిలక్షణగ్రంథమునుండి యుదాహరించెనా యని సందేహము. లక్షణదీపికాప్రతులు నాయొద్దను ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునను గలవు. ......... లక్షణదీపికలలో నన్నిప్రతులలో నానాల్గు పద్యములు గలవు" అని తెలిపియున్నారు.[1] ఈవాక్యములవలన శ్రీ రామకృష్ణకవిగారియొద్ద నున్న ప్రతులును, ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందలి ప్రతులును 'గ' ప్రతిని బోలినవని యూహింప

1. చూ. శ్రీరంగమహత్త్వము. పీఠిక. పుట. iv

నగును. కోరాడ రామకృష్ణయ్య, ఎమ్.ఏ. గారు, నవనాథచరిత్రము పీఠికలో పైనుదాహరించిన 'క' ప్రతిలోని "అస్తిప్రశస్తావనిపాలమాళి" ఇత్యాదిశ్లోకములను, 'గ' ప్రతిలోని "ఇతివితరణవిజితవినుతపారిజా" తేత్యాది గద్యమునుగూడ నుదాహరించియున్నారు[2]. వా రుదాహరించిన విషయములనుబట్టి పై రెండుప్రతులను బోలిన ప్రతి వేఱొకటి వారికి లభించియుండెనేమో ? కాని వా రేప్రతినుండి యాయంశముల నుదాహరించిరో తెలుపరైరి. ఏది యెట్లున్నను నీలక్షణదీపిక గౌరనతండ్రినిఁ గూర్చియు, పెదతండ్రినిఁగూర్చియు బాగుఁగదెలుపుచు గౌరనకాలమును నిర్ణయించుటకుఁ దగియున్నది.

## లక్షణదీపికయందలి విషయవిశేషములు.

అముద్రితముగాన నిందలి విషయవిశేషములను బాఠకుల కెఱిఁగించుటకై కొంచె మధికముగఁ దెలుపుచున్నాఁడను.

'క' ప్రతియందుఁ గవి తెలుపనెంచిన లక్షణవిశేషములు వెనుకఁ దెల్పిన "వర్ణానాముద్భవః పశ్చాత్" ఇత్యాదిశ్లోకస్థములు.

ఇఁక 'గ' ప్రతియందు

1. వర్ణగుణదోషవిచారము.
2. నాయకలక్షణము.
3. కవిలక్షణము.
4. గణసంఖ్య.
5. గణాధిదేవతలు.
6. గణజాతివిభాగము.
7. గణస్వరవివేకము.
8. గణజాతివివేకము,
9. గణశుభాశుభకత్వ్యాదివిచారము
10. గణోద్దిష్టనక్షత్రవిచారము.
11. సజీవనిర్జీవనక్షత్రస్వరూపము.
12 దగ్ధజ్వలితధూమ్రనక్షత్రములు.
13. నక్షత్రానుకూల్యము.
14. గ్రహమైత్రీప్రకారము.
15. గణకూటప్రకారము.
16 దూరకూటప్రకారము.
17. యోనికూటప్రకారము.
18 అక్షరవిచారము.
19. అక్షరజాతివివేకము.
20. అక్షరగతులు.

---

2. చూ. నవనాథచరిత్రము. పీఠిక. పుట. X,XII

21. విషాక్షరవివేకము.
22. రూక్షస్నిగ్ధాస్నిగ్ధవివేకము.
23. అకారాదిక్షకారాంతవర్ణ శుభాశుభవిచారము.
24. మాతృకాపూజనము.
25. మాతృకాన్యాసప్రకారము.

అను నీవిషయము లుదాహరణములతో వర్ణింపఁబడినవి.

## 'క' ప్రతియందుఁ బేర్కొనఁబడిన గ్రంథములు.

1. సాహిత్యచూడామణి.
2. చమత్కారచంద్రిక.
3. శారదాతిలకము.
4. ప్రపంచసారము.
5. త్రిభాష్యరత్నాకరము.
6. వాసవదత్త
7. సాహిత్యచంద్రోదయము.
8. కవికంఠపాశము.
9. సాహిత్యరత్నాకరము.
10. బృహజ్జాతకము.
11. అమరుకము.
12. సంహితాసారము.
13. నామలింగానుశాసనము.
14. కిరాతార్జునీయము.
15. న్యాయసారము.
16. నైషధము.
17. సంహితాసంగ్రహము.
18. కవిరాజగజాంకుశము.
19. ప్రబంధదీపిక.
20. రత్నమాల.

## 'గ' ప్రతిలో వేర్కొనఁబడిన గ్రంథములు.

1. అలంకారసంగ్రహము.
2. కవికంఠపాశము.
3. చమత్కారచంద్రిక.
4. న్యాయసారము.
5. భరతరత్నకోశము.
6. యోగరత్నాలయము.
7. కుమారసంభవము.
8. సాహిత్యరత్నాకరము.
9. సాహిత్యచంద్రోదయము.
10. రసార్ణవసుధాకరము.
11. కవిరాజగజాంకుశము.
12. సాహిత్యచూడామణి.
13. భరతసంగీతరత్నకోశము.
14. బృహజ్జాతకము.
15. అలంకారచూడామణి.
16. శాకినీసహాకారము.
17. అమరుకము.
18. అలంకారసర్వస్వము.

19. సాహసాఙ్క కావ్యము.
20. కృష్ణవిజయము.
21. మంత్రమహార్ణవము.
22. మంత్రాథర్వణము.
23. త్రివిధము.
24. ఉత్తమగండచ్ఛందము
25. మనుస్మృతి.
26. ఋగ్వేదము.
27. మాఘము.
28. ఉత్తరరామచరితము.
29. కాలనిదానము.
30. మణిదర్పణము.
31. భట్టచ్చము.
32. భోజరాజీయము.
33. ఫణితశాస్త్రము.
34 సంహితాసారము.
35. రత్నమాల.
36. వాసిష్ఠసంహిత.
37. సంహితాసంగ్రహము.
38 కవిగజాంకుశము.
39. నిధిప్రదీపిక.

## ఆంధ్రచ్ఛందో గ్రంథములు.

1. శ్రీధరచ్ఛందము.
2. ఆంధ్రకవిగజాంకుశము.
3. గోకర్ణచ్ఛందము.
4. భీమనచ్ఛందము.
5 అథర్వణచ్ఛందము.

అనునివి.

ఇట్లీతఁడు తనలక్షణదీపికయందుఁ బేర్కొనిన గ్రంథములనుబట్టియు లక్షణనిర్మాణపాటవమునుబట్టియు నీతఁడు సాహిత్యచతురుఁడని తెలియుచునేయున్నది. ఈవిషయమును "చతురసాహిత్యలక్షణచక్రవర్తి" అను హరిశ్చంద్ర చరిత్రలోని వాక్యమును "సరససాహిత్య లక్షణవివేకముల" అను నవనాథచరిత్రలోని వాక్యమును స్థిరీకరించుచున్నవి.

## గ్రంథత్రయమేకకర్తృకము.

లక్షణదీపిక, హరిశ్చంద్రచరిత్రము, నవనాథచరిత్రము అను నీమూఁటిని రచించిన గౌరన యొక్కఁడే యనుటకుఁ దగిన యుపపత్తులను జూపుచున్నాఁడను. గౌరన తాను సింగయమాధవుని మంత్రియగు పోత

నామాత్యుని తమ్ముఁడగు అయ్యలుమంత్రికుమారుఁడనని లక్షణదీపికలోఁ ప్రారంభమునఁ దెలిపియున్నాఁడు.[8] హరిశ్చంద్రచరిత్రమునను

" సింగయమాధవక్షితిపాలమణికి
మంగళమూర్తికి మంత్రియై జగతిఁ
బొగడొందు పెద్దనపోతరాజునకుఁ
దగినతమ్ముఁడు యశోధనుఁ డయ్యలన్నఁ
జెట్టఁ బట్టంగ నోచిన భాగ్యవతికిఁ
జుట్టాలసురభికి సుందరీమణికి
ఘనుఁడు వల్లభమంత్రిగంగాంబ నోరి
కనిన పోచాంబకు గారాబుసుతుఁడ
భూతనాయక పాదపూజాభిరతుఁడ
గౌతమగోత్రుండ గౌరనాహ్వయుఁడ
సరససాహిత్యలక్షణచతురుఁడ "

నని తెలిపికొనినాఁడు.

ఇటులనే నవనాథచరిత్రమున

"ఇప్పుడుగల సుకవీంద్రులలోన
సరససాహిత్యలక్షణవివేకముల
సురుచిరమధురవచోవిలాసములఁ
గుణశీలములను సద్గుణకలాపముల
నలవడ్డవాఁ డెవ్వఁడని విచారించి
సింగయమాధవక్షితిపాలమంత్రి
పుంగవుఁడై యొప్పు పోతురాజునకు
ననుజాతుఁడగు నయ్యలామాత్యమూర్తి
తనయుఁ డుత్తముఁడు గౌతమగోత్రజుండు
ప్రమరాంబికావరప్రాప్తవిచిత్ర

8. చూ. "అస్తిప్రశస్తావనిపాలమౌళి" ఇత్యాది శ్లోకములు. పుట. 8.

విమలసాహిత్య ప్రవీణాధికుండు
ననఘచిత్తుఁడు గౌరనాహ్వయఖ్యాతుఁ”
డన్ను రావించెనని తెలిపినాఁడు.

ఇట్లీ మూఁడిట గౌరనవంశక్రమ మొకరీతిగనే వర్ణింపఁబడుటచే నీమూఁడు కృతులను రచియించిన యాతఁడొక్కఁడే యనుటకు సంశయము లేదు. మఱియు ద్విపదకృతులు రెండును మల్లికార్జునున కంకితమిచ్చుటచే నీగౌరన శివభక్తి ధురంధరుఁడని విదితమే. లక్షణదీపికయందును దనశివభక్తి పారవశ్యతను నీక్రిందిరీతిని దెలిపియున్నాఁడు.

“సోఽహం సోమకళామౌళి ప్రసాదా ద్గతకల్మషః”
ప్రణమ్య విద్వజ్జనపారిజాతం
కవీంద్రవిప్రార్చితపాద పంకజం
విభుం ప్రభుం విశ్వసృజం మహేశం
సంవక్ష్యతే లక్షణదీపికేయమ్”

అని యీశ్వరునకే తనకృతుల నర్పించినాఁడు.

## గౌరనతండ్రి పేరు అయ్యలామాత్యుఁడే.

గౌరనతండ్రిపేరు అయ్యలుమంత్రి యగునా? కాదా? యని విమర్శకులు సంశయించుచున్నారు.

ఈసంశయమునకుఁ గారణ మేమన హరిశ్చంద్ర చరిత్రము ప్రారంభమున “తగినతమ్ముఁడు యశోధను డెల్లమంత్రి” అనియు, తుదిని ‘మతిమంతుఁ డయ్యలమంత్రి పుంగవుని’ అనియుఁ బరస్పరవిరుద్ధముగ ముద్రిత ప్రతులందుఁ బాఠము గానవచ్చుటయే. దీనిపై శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు ‘తగిన తమ్ముఁడు యశోధనుఁ డెల్లమంత్రి’ అనునది దిద్దుటకు వీలులేనిది గనుక తుదినిగూడ ‘ఎల్లనమంత్రి పుంగవుని’ అనియే యుండనోపు నని, గౌరనతండ్రిని ‘ఎల్లమంత్రి’నిగాఁ జేసినారు. దీనిపై శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు నవనాథచరిత్ర పీఠికలో హరిశ్చంద్ర ద్విపదలోని ‘తగిన తమ్ముఁడు యశోధనుఁడెల్లమంత్రి’ అనునది సంస్కరింప వీలులేనిదిగాఁ దలంచ నక్కఱలేదు. ‘తగినతమ్ముఁడు యశోధను డయ్య

లార్య'అనిగాని,తగినతమ్ముని యశోధను నయ్యలార్య అనిగాని సంస్కరించుట దుస్సాధముగాదు అని తెలిపియున్నారు[4]. పంతులుగారు కాని రామకృష్ణయ్యగారుకాని హరిశ్చంద్ర చరిత్రము తాటియాకు ప్రతులను జూడకయే యిట్లు వ్రాసినారని యూహింపవలెను.ఏమన తాటియాకు ప్రతులం దెచ్చటను'ఎల్లమంత్రి'అను పాఠమే గానరాదు. విమర్శకులకు శ్రమ లేకుండ పూర్వోత్తర విరోధ మిసుమంతయు లేనట్లుగ "తగినతమ్ముఁడు యశోధనుఁ డయ్యలన్న" అనుపాఠమే పెక్కుప్రతులందుఁ గానవచ్చెడిని[5].

## గౌరనకాలము.

గౌరనకాలనిర్ణయమునుగూర్చి విమర్శకు లందఱు తమతమ యభిప్రాయములను వెలువఱిచియున్నారు. వారిలోఁ బ్రధానముగఁ గొందఱ యభిప్రాయముల నెఱుకపఱిచి, పిదప నాయభిమతమును దెలిపెదను. గౌరనపెదతండ్రియగు పోతన సింగయమాధవునియొద్ద మంత్రిగా నుండెనని యాతఁడు రచించిన గ్రంథముల మూఁడిటను దెలిపియున్నాఁడు. సింగయమాధవుఁడు అనఁగా సింగభూపాలుని కుమారుఁడగు మాధవభూపాలుఁడు. రేచర్ల వంశమునం దట్టిసింగయమాధవు లిరువురు గలరు. ఆక్రమమిట్టిది.




4. చూ. నవనాథచరిత్రము పీఠిక. పుట. x, xi

5. చూ.పరిషద్భాండాగారము నందలి తాళపత్ర ప్రతులు. 1348, 2886,2137, 1667 సంఖ్యలుగలవి.

ఇప్పు డీకవి పేర్కొనిన మాధవభూపాలుఁడు మొదటి సింగభూపాలునికుమారుఁడగు మాధవుఁడా ? లేక రెండవ సింగభూపాలుని కుమారుఁడగు మాధవుఁడా ? అనుసందేహము చిరకాలమునుండి చరిత్రపరిశోధకులను బీడించుచునేయున్నది.

మానవల్లి రామకృష్ణకవిగారు శ్రీరంగమహాత్త్వము పీఠికలో రెండవసింగని కుమారుఁ డీమాధవుఁడనియు, ఈతనితాత రామాయణమునకు 'రాఘవీయ'మను వ్యాఖ్యానమును రచించినట్లు,

శ్లో॥ శాకాఖ్యే నిధివార్ధిరామశశిగే వ్యబ్దే ప్లవంగే శుభే
మాసేఽప్యాశ్వయుజే రఘూద్వహపదే యోరాఘవీయాహ్వయామ్
టీకా మర్థపటుప్రబోధఘటనామాణిక్యపుష్పాంజలిం
కృత్వా రాజతి రావుమాధవనృపో రామాయణస్య శ్రియే.

అను నీచాటుశ్లోకము చాటుచుండుటచేతను, దీనినిబట్టి క్రీ. శ. 1427 లోఁ దొలుతటి సింగయమాధవుఁ డుండెనుగాన, మనుమని కాలమువాఁడయిన యీగౌరన 1500 ప్రాంతములో నుండెననిరి.

కాని యీచాటుశ్లోకము రెండవ సింగయకుమారుఁడగు మాధవభూపాలునిభార్య నాగాంబిక నెలకొల్పిన శ. క. ౧౩౫౧ నాఁటి నాగారము శాసనములోఁ గానవచ్చుచున్నదిగాన రామాయణమునకు రాఘవీయవ్యాఖ్యానమును రచియించిన మాధవుఁడు మనుమఁడేగాని తాతయగు మాధవుఁడు కానేరఁడు. కావునఁ బైనిర్ణయము సరిపడదు.

చిలుకూరి వీరభద్రరావుగారు తమ 'శ్రీనాథకవి'అను గ్రంథమున గౌరనకాలమునుగూర్చి యిట్లు తెలిపియున్నారు. "హరిశ్చంద్రచరిత్ర ద్విపదకావ్యముగా రచించిన గౌరనమహాకవి తనపెదతండ్రి పోతరాజు దేవరకొండ రాజ్యాధిపతియగు సింగయమాధవక్షితిపాలమణికి మంత్రిగా నుండెనని చెప్పియుండుటచేతను, సింగనమాధవభూపాలుఁడు క్రీ. శ. ౧౪౨౩ లో రామాయణమునకు వ్యాఖ్య రచియించినాఁడని వీనిభార్యయగు నాగాంబిక రాచకొండ కుత్తరమున నాగసముద్రమును

తటాకమును ద్రవ్వించి వ్రాయించిన శిలాశాసనములో నుండుటచేతను గౌరన తననవనాథచరిత్రపీఠికలో శాంతభిక్షావృత్తియతీశ్వరుని సవిశేషముగా నభివర్ణించియుండుటచేతను 1430 ప్రాంతముననున్న పోతన కుమారుఁడైన గౌరనకవి 1450 ప్రాంతమున నుండుట సత్యమునకు విరుద్ధము కాదు[6]

వీరు తెలిపిన గౌరనకాలనిర్ణయము సరిపడుచున్నది. కాని నాగారము శాసనమునందుఁ జేర్కొనఁబడిన మాధవుఁడు దేవరకొండ రాజ్యాధిపతిగాఁడు. దేవరకొండ రాజధానిగ రాజ్యమేలిన మాధవుఁడు మొదటి సింగభూపాలుని కుమారుఁడగు మాధవుఁడు. ఆతఁడు నెలకొల్పిన శాసనము శ. క. ౧౨౯౭ నాఁటిది గలదు. అం దాతఁడు దేవరకొండ కధిపతిగా నుండినట్లు తెలుపఁబడినది. ఆతఁడు రామాయణమునకు వ్యాఖ్యానమును రచియించియుండలేదు. నాగారముశాసనమునం దుదాహృతుఁడైన మాధవుఁడు రెండవ సింగభూపాలుని కుమారుఁడగు మాధవుఁడు. ఈతఁడు రామాయణ వ్యాఖ్యానము రచించిన ట్లీశాసనమునఁ గలదు.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమశృంగార శ్రీనాథమున నిట్లు వ్రాసియున్నారు.

"శాంతభిక్షావృత్తియతీశ్వరుని శాసనములు కొన్ని కర్నూలు మండలమునఁ గలవు. ఆతఁడు సరిగా శ్రీనాథునికాలమువాఁడే. ఆంధ్ర కవిత్వమం దాతని కత్యాదరముండెను. ఆకాలమున నామఠాధీశ్వరు లంధ్రులయియుండిరేమో ? కాని యిప్పటివారు కర్ణాటకులు. శాంతభిక్షావృత్తి తనభృత్యునకుఁ గృతియిప్పించుటయే గాక తానుగూడ గౌరన మంత్రిచే నవనాథచరిత్రమను తెనుఁగుకృతి మల్లికార్జునదేవున కంకితముగాఁ జెప్పించుకొనియెను. నవనాథచరిత్రకారుఁడు గౌరన సరిగా

6. చూ. శ్రీనాథకవి. చిలుకూరి వీరభద్రరావుగారు. పుట. ౫౭౦-౫౭౧.

శ్రీనాథునికాలమువాఁడు. అతఁడు సంస్కృతమున లక్షణదీపిక యను గ్రంథమును రచించెను.[7]

శ్రీ శాస్త్రిగారు దెలిపిన కాలనిర్ణయము సరిపడుచునేయున్నది. ఇంచుమించుగ శ్రీనాథుఁడుండినకాలములో నీతఁడుండెననుట యుక్తము.

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు నవనాథచరిత్ర పీఠికలో నీతని కాలమునుగూర్చి యిట్లు ప్రసంగించియున్నారు. గౌరన తండ్రియగు అయ్యలామాత్యుఁడు, మాధవక్షితిపాలునకు మంత్రియైన పోతరాజునకుఁ దమ్ముఁడు. ఈమాధవుఁడు 15 వ శతాబ్దిని రాచకొండ రాజ్యమేలిన సర్వజ్ఞసింగనామధేయుని కొడుకనియు, నాతనియొద్ద మంత్రిగానున్న పోతరాజే గౌరనకుఁ బెదతండ్రియయినట్లును, ఈతనిచే రచింపఁబడిన లక్షణదీపికయందలి "అస్తి ప్రశస్తావనిపాలమౌళి" ఇత్యాదిశ్లోకములవలనఁ దెలియుచున్నదనిరి. మఱియు, "సర్వజ్ఞసింగభూపాలుఁడని పేరువడసిన రావుసింగమహీపాలు నాస్థానమునకు శ్రీనాథుఁడు పోయినట్లును, నాతఁడు మహావిద్వాంసుఁ డగుటచే నాతని మెప్పించువిషయమున నీతఁడు కొంత జంకుకలవాఁడై 'దీనారటంకాల' ఇత్యాదిపద్యమును జెప్పి రాజసభాధిదేవతయగు శారదాంబను స్తుతించెనని ప్రసిద్ధి గలదుగదా? అట్టి సర్వజ్ఞునికొడుకగు నీసింగయమాధవనృపాలుఁడు గూడ గొప్పపండితుఁడై శాలి. శక. 1349 సంవత్సరము (క్రీ. శ. 1427) న రామాయణమునకు రాఘవీయమను నొకటీక వ్రాసెనని యాతని భార్య రచింపించిన శాసనమునందలి 'శాకాఖ్యేనిధివార్ధి' త్యాదిశ్లోకమువలన స్పష్టమగుచున్నది. ఇట్లు క్రీ. శ. 15 వ శతాబ్ది తొలిభాగమున నున్న సింగయమాధవనృపాలునియొద్ద మంత్రిగానున్న పోతరాజునకు ననుజుఁడగు గౌరన 15 వ శతాబ్దిపూర్వార్ధమున నుండెననుటకు సందేహము లేదు. మఱియు శ్రీనాథునిచే శివరాత్రిమాహాత్మ్యమును దనభృత్యుఁడగు ముమ్మడి శాంతయ్యకుఁ గృతియిప్పించిన శ్రీశైలజంగమ

7. చూ. శృంగారశ్రీనాథము. పుట. 274-275.

మఠాధీశ్వరుఁడగు శాంతభిక్షావృత్తిరాయఁడే గౌరనచే నవనాథచరిత్ర మును మల్లికార్జునిపేరఁ గృతిగాఁ జెప్పించుటచే శ్రీనాథునికాలము వాఁడేయని స్పష్టంబగుచున్నది."

శ్రీమద్రామాయణమునకు రాఘవీయమను వ్యాఖ్యానమును రచియించిన మాధవనాయని తండ్రియగు సింగభూపాలుఁడు రేచర్లవంశ మునందలి రెండవ సింగమనాయకుఁడు. ఈతఁడే రసార్ణవ సుధాకర మను నలంకారగ్రంథమును రచించినయాతఁడు. ఈతనికి సర్వజ్ఞబిరుదము కల దనియు, నీతని యాస్థాని కేఁగినపుడు శ్రీనాథుఁడు 'దీనారటంకాల'ఇత్యా దిపద్యమును జెప్పెననియు శ్రీరామకృష్ణయ్యగారి యభిప్రాయము. అ ట్లీతనికి సర్వజ్ఞబిరుదము కలదనుటకుఁ దగిన యితరాధారములను వారు తెలిపియుండలేదు. వెలుగోటివారి వంశచరిత్రమున మాత్ర మీతనికి సర్వజ్ఞ బిరుద మున్నట్లు తెలుపఁబడినది. దానిని బురస్కరించుకొని కాఁబోలు రామకృష్ణయ్యగా రట్లు తెలిపియుండిరి. ఇతర విమర్శకు లం దఱు నీరసార్ణవసుధాకర కర్తకు సర్వజ్ఞబిరుదము లేదని ఘంటాపథ ముగ ఘోషించుచున్నారు. కాని యీసింగభూపాలుని యాస్థాని నున్న బొమ్మకంటి అప్పయార్యుఁడు తాను రచించిన అమరకోశవ్యాఖ్యలోను, సింగభూపనామాంకితముగ నలంకార శాస్త్రగ్రంథమును రచించిన విశ్వే శ్వరకవి తన చమత్కారచంద్రికలోను నీరసార్ణవసుధాకర కర్తకు సర్వజ్ఞ బిరుదమున్నట్లు తెలిపియున్నారు[8]. మఱియు శ్రీమానవల్లి రామకృష్ణ కవిగారు 'ఆంధ్రులు రచించిన సంగీతరత్నాకర వ్యాఖ్యలు' అనువ్యాస మున నీసింగభూపతికి సర్వజ్ఞబిరుద మున్నట్లు సింగభూపాల విరచితమైన సంగీత సుధాకరమునందలి యీక్రింది శ్లోకము నుదాహరించియున్నారు.

8. శ్లో. విద్యాదైవత తాత తావకగురో సర్వజ్ఞచూడామణే......సంవాదికమ్.

చ. చంద్రిక.

జైవాతృకం బుధగురుం నిలయం కలానాం సర్వజ్ఞమూర్ధమణి మాశ్రితశుద్ధపక్షమ్, శ్రీబొమ్మకంట్యుపపదాంకిత మప్పయార్యం సర్వేప్సితోషితసురంద్విజరాజ మాహుః॥

అమరకోశవ్యాఖ్య.

"అతిగంభీరే విషయే కతిపయవేద్యే త్విహ గ్రంథే
సమ్యగ్వ్యాఖ్యాకుశలః సర్వజ్ఞః సింహ(గ?) భూప ఏవైకః[1].

రసార్ణవసుధాకర కర్తయగు సింగభూపాలుఁడే సంగీత సుధాకర కర్తయును. కవిగా రుదాహరించిన పైశ్లోక మాగ్రంథము నందుండినచో రసార్ణవసుధాకర్తకు సర్వజ్ఞబిరుదము కలదనుట కెంతమాత్రమును సంశయింపఁ బనిలేదు.

కావున నీయంశమున శ్రీరామకృష్ణయ్యగారి యభిప్రాయము సరిపడుచునే యున్నది.

ఇఁక నీ గౌరన-సింగయమాధవుల కాలనిర్ణయమునుగూర్చి శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి షష్టిపూర్తిసంచికలోఁ బ్రచురించిన 'గౌరనమంత్రి-సింగయ మాధవుఁడు' అను వ్యాసమును నందలి కాలనిర్ణయమును బరికింతము. శర్మగారు శాసనపరిశోధకులలో నగ్రగణ్యులుగ నెంచఁబడువారు. వా రేదిప్రసంగించినను శాసనాదిప్రమాణపురస్సరముగనే యుండును వారివాక్యములు సర్వథాప్రమాణములే గాని ప్రమాదములు గానేరవు. కాని గౌరనకాలమునుగూర్చి వారు తెలిపిన ప్రమాణములు మాత్రము సరిపడనట్లు తోఁచెడిని. శర్మగా రావ్యాసమునం దిట్లు వ్రాయుచున్నారు.

"గౌరనకాలము తెలియుటకు ముందు సింగయ మాధవునికాలము తెలియవలెను. హరిశ్చంద్ర నవనాథచరిత్రములవలన సింగయ మాధవుఁ డెవఁడో స్పష్టముగఁ దెలియకపోయినను లక్షణదీపిక ననుసరించి యాతని వృత్తాంతము కొంత తెలియుచున్నది.

మ. సూ. షష్టిపూర్తి సంచిక. పుట 41.

శ్రీ వీరేశలింగము పంతులుగారు కాని శ్రీకోరాడ రామకృష్ణయ్యగారు కాని వెలుగోటి వంశచరిత్రమును జూచియు ప్రమాదము పాల్పడినా రదియెట్లో? శ్రీరామకృష్ణయ్యగారు సర్వజ్ఞసింగభూపతి విషయమునుకూడఁ దెచ్చి ఈగౌరనమంత్రి కాలసమస్యను మరింత క్లిష్టముచేసి

1. చూ. భారతి. ధాత. సం॥ కార్తికమాసము. పుట-౬౨౩.

నారు. లక్షణదీపికా శ్లోకములం దుదాహృతుఁడయిన సింగభూపతి సర్వ జ్ఞ సింగభూపతియనుట కాధారము మృగ్యము. పుట. 46-47.

"శ్రీ పీఠేశలింగముగా రుదాహరించిన "శ్రీమత్తో మాధవేంద్ర స్య......"యస్యామాత్య శిఖామణేః......"శాకాబ్ధైనిధి వార్ధిరామ శశిగే......" అను శ్లోకములు శాసనములోనివే......పై నుదాహరించిన మూఁడుశ్లోకములలో మొదటిరెండును హైదరాబాదు సంస్థానము నందలి మహబూబునగరము జిల్లా అమరవాది తాలూకాలోఁ జేరిన శ్రీశైలోత్తరద్వారమైన ఉమామహేశ్వరము దేవస్థానసమీపమున నున్న మాదానాయని శాసనములోనివి" పుట 47.

"ఈపై విషయముల ననుసరించి చూచినచో ఉమామహేశ్వర శాసనమునందలి మాధవుఁడు మొదటి సింగభూపతి కుమారుఁడయిన మొదటి మాదానాయకుఁడనియు, అతఁడు శకవర్షములు ౧౨౯౫ (క్రీ. శ. ౧౩౭౩ నాటివాఁడనియు, అతనికడనే గౌరనమంత్రి పెదతండ్రియైన పెద్ద నపోతరాజు మంత్రిగా నుండెననియు, నాగారము శాసనమునందలి శక వర్షము. ౧౩౪౯ (క్రీ. శ. ౧౪౨౭) నాటి సింగయమాధవుఁడు ఉమామహేశ్వరము శాసనమునందలి సింగయమాధవునికి మనుమఁడనియు విస్పష్టమగుచున్నది. అట్లగుటంజేసి ఎవరియొద్ద పోతురాజు మంత్రిత్వము వహించెనో ఆసింగయ మాధవుఁడు శ్రీమద్రామాయణ టీకాకారుఁడు కాఁడనియు, రూఢమగుచున్నది. పెద్దనపోతురాజు ప్రభువయిన మాధవుఁడు మొదటి సింగభూపాలుని కుమారుఁడని నిర్ధారితమైనందున ఈసింగభూమాధవుఁడు సర్వజ్ఞసింగభూపతి కాఁడనుటకు పెద్ద వితర్కమక్కఱలేదు.

హరిశ్చంద్ర నవనాథచరిత్రములందు గౌరన పేర్కొనిన సింగయ మాధవుఁడు మొదటి సింగభూపతి కుమారుఁడయిన మాధవభూపాలుఁడగుటవలన గౌరనమంత్రికాలము ఇంక కొంచెము వెనుకకు పోవుచున్నది. అతఁడు క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్ది అంతమునం దుండినట్లు నిశ్చయింపవచ్చును." పుట. 49.

శర్మగారు సింగయమాధవుని గుర్తించుటకు లక్షణదీపికను హరిశ్చంద్ర నవనాథచరిత్రలకంటె నెక్కుడు ప్రమాణముగఁ గైకొనియున్నారు. కాని ఆలక్షణదీకపియం దుదాహరించిన లక్షణగ్రంథములను బరికింపరైరి. గౌరన లక్షణదీపికయందు రేచడవసింగభూపాలునిచే రచింపఁబడిన రసార్ణవసుధాకరమునుండియు, ఆతని యాస్థానకవీశ్వరుఁడగు విశ్వేశ్వరునిచే రచింపఁబడిన చమత్కారచంద్రికనుండియు శ్లోకము లుదాహరించినాఁడు. ఈరెండు గ్రంథముల నీతఁ డుదాహరించినప్పుడు వారిద్దఱకుఁ దరువాతికాలమువాఁ డని యొప్పుకొనకతప్పదుగదా? రసార్ణవసుధాకరకర్తకాలము నిదమిత్థమని నిర్ణయించుటకుఁ దగిన శాసనాద్యాధారములు లేవు. కాని యీతనితండ్రియగు అనపోతానాయని శాసనములు శకవర్షములు ౧౩౦౨ (క్రీ. శ. 1380) వఱకుఁ గానవచ్చుచున్నవి. తరువాత నీతని యాఱవపుత్త్రుఁడగు మాదానాయనిభార్య నాగాంబిక నెలకొల్పిన శాసనము శక. సం. ౧౩౪౧ (క్రీ శ. ౧౪౧౯) నాఁటిది గానవచ్చుచున్నది.[10] ఈనడుమనున్న కాల మీసింగభూపాలుని కాల మనుకొనవచ్చును. ఈతఁ డెంతకాలము రాజ్యమును బాలించెనో స్పష్టముగఁ దెలియుట కితరాధారము లేకున్నను, రసార్ణవసుధాకరము పీఠికయందలి యీక్రిందిశ్లోకమునుబట్టి దీర్ఘాయుష్కుఁడై చిరకాలము రాజ్యమేలెనని తెలియుచున్నది.

శ్లో. అథ శ్రీసింగభూపాలో దీర్ఘాయు ర్వసుధా మిమామ్
నిజాంసపీఠే నిర్వ్యాజం కురుతే సుప్రతిష్ఠితామ్.

రసా. సుధా. ౧ విలా. 27 శ్లో.

కావున నీసింగభూపాలుఁడు క్రీ. శ. 1380 మొదలుగ 1425 వఱకు రాజ్యమును బాలించెననుకొనినను బాధక ముండఁజాలదు. అట్లగుటంజేసి చమత్కారచంద్రికారచనాకాలము క్రీ. శ. 1400 లకు పైఁబడి యుండితీరవలయును. ఆగ్రంథము నుదాహరించిన యీగౌరన కాల మంతకుఁ బూర్వమున కెట్లును బోఁజాలదుగదా.

10. చూ. వెలుగోటివంశచరిత్రము. అనుబంధము.

వెలుగోటివంశచరిత్రమందు మొదటిమాధవనాయనిశాసనమున పెద్దనపోతరా జాతనికి మంత్రిగ నున్నట్లు శ్లోకము లుండుటను, 'శ్రీ శ్రీ శ్రీ పెద్దిరాజుకొడుకు పోతురాజువ్రాలు' అను నక్కరము లుండుటను బరికింపక వీరేశలింగముపంతులుగారును, రామకృష్ణయ్యగారును రెండవమాధవభూపాలునియొద్ద మంత్రిగ నున్నట్లు వ్రాయుట పొరపాటని శర్మగారియభిప్రాయము. కాని మాదానాయని ఉమామహేశ్వర శాసనమునకును, అందలి తుదిశ్లోకములకును సంబంధ మెంతమాత్రమును గానరాదు. పాఠకుల కావిషయమును దెలుపుటకై శాసనస్వరూపము నిటఁ జూపుచున్నాను.

## మాదానాయని ఉమామహేశ్వరము శాసనము.

శ్రీ గణపతయేనమః. స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర రాయగాయగోవాళ గజదళవిభాళ భుజబలభీమ ఖడ్గనారాయణ సోమకులపరశురామ సత్యహరిశ్చంద్ర శౌచగాంగేయ అప్రతిహతప్రతాపోదయ సతత హేమాద్రిదాననిరత దాచయసింగభూపతిసుతుండైన మేదినీరూపనారాయణ సింగమాంబాగర్భపుణ్యోదయ రేచర్లవంశదుగ్ధాబ్ధిసుధాకరుండైన శ్రీమాధవదేవేంద్రుండు దేవనగదక్షిణప్రాంతమందుల స్వనామాంకిత మాధవపురమందు స్వరాజ్యోపవిష్టుండై శ్రీపర్వతోత్తరద్వారమైన మహేశ్వరదేవరమంటపము మహాచ్ఛిలాసమూహానను రమ్యముగా రచియింపించి పదవాక్యప్రమాణజ్ఞులైన మాయభట్టోపాధ్యాయులను తన్నిమిత్తంబై శాసనంబు చెక్కుమని పనిచినం దదుక్తశాసనంబు.

యస్మిన్నుద్ధరతి క్షితి మ్మధురిపౌ కోలాకృతౌ సంభ్రమా
దుద్గారస్య మితౌ వివేకవిధురా స్సర్వేపి ఖర్వాశయాః
సత్యస్థాః కలయంతి సత్య మవనిం పాతాళగా స్సర్వతః
పాతాళం దిగిభాశ్చ భారవిరహాః పాయాత్సవ స్సర్వదా.
పాయా దాదివరాహస్య దంష్ట్రామధ్యగతా మహీ
పంచమీ చంద్రలగ్నస్య కలంకస్యానుకుర్వతీ. ౮

యశఃప్రతాపౌ మూర్తౌతు దేవదేవస్య శార్ఙ్గిణః
పాయాస్తాం పరమానన్దకారిణౌ శశిభాస్కరౌ. 3
హేరంబస్య ముదం కరోతు భవతాం వక్రక్రియాకౌతుకీ
యో దంతేన నిపీడ్య నిర్జరగిరిం నిక్షేప్తుకామో రుషా
బిభ్యత్సు త్రిదశేషు తద్గిరితటే ఛాయాం నిరీక్ష్యాత్మన
స్తాంభింద న్ప్రతిదంతివక్త్రమనసా దేవానభీకా...
పాతువః పద్మనాభస్య శయ్యా శేషఫణీశ్వరః
చకితేవ యత్రో లక్ష్మీ స్సురో యస్య నముంచతి. ౫
పురావిరాసీత్పురుహూతభూతిః
పాదారవిందా దరవిందయోనేః
వర్ణ స్తురీయో...సిద్ధసింధు
సందోహసంతానయశోవితానః. ౬
తుర్యే తత్ర తురీయవిక్రమకథాచాతుర్యధుర్యోదయో
వర్ణో దేవపదారవిందజననా ద్భాగీరథీస్పర్ధినా
పాథోవత్ప్రథితప్రభావవిధినా ప్రాప్తోభిధాం లక్షశ
శ్శ్రేష్ఠ స్తేషు గరిష్ఠపుణ్యమహిమా శ్రీవర్ణవంశోదధిః.
లావణ్యైకరస స్తథాపి మధురో భంగైర్విహీనః పరం
సత్త్వాకీర్ణ నిజాంతరోఽపి నజడాసంగో నముక్తాశ్రితః
విస్ఫూర్జత్పరరాజమండలరుచిద్వేషీ నదేవాసురై
ర్యత్నౌఘై ర్మథితో నచాపి మునినా పీత స్సవంశాంబుధిః.
ముక్తాఫలానాం సంభూతి ర్వంశేఽస్తీతి జనశ్రుతిః
అస్మి న్వంశేతు సంభూత స్సంతాన స్సర్వకామదః
తత్రాజని జనానందీ జేతా జన్యేషు వైరిణాం
విక్రమే విజయాకారో వీరో వెన్నమహీపతిః. ౧౦
దోర్దండశాలినా యేన మండలాగ్రేణ ఖండితా
రిపుశుండాలశుండాలీ జయలక్ష్మీకచాయతే. ౧౧

తస్మా దాశిరభూ దగణ్యమహిమా క్షోణీభృతా మగ్రణీ
శ్రీమాన్ దాచమనాయకో విజయశోసీరంధ్రితాశాంతరః
య స్యాసన్నిహ పక్షిణోఽపి రిపవో భిల్లా స్సదారాఅపి
త్యక్త్వాశా భువి భిక్షవో వివసనా అప్యంబరాంతాశ్రయాః
యస్యాహితానాం రహితాంబరాణాం
ప్రాప్యాంతరిక్షం పరితోంతరిక్షమ్,
తదాది నూనం భజతే నురూపం
గణాస్వయా దంబరనామధేయమ్. ౧౩
అభూ త్తస్మాదగ్రప్రతిమరిపురాజద్విపఘటీ
చపేటీవైదగ్ధ్యప్రథితపృథుకంఠీరవవరః
కరాల క్షోణీశక్షపితవరవక్షస్థలరమా
సమా... జగతి విజయా సింగనృపతిః ౧౪.
యస్యోద్యత్కరదానవారివిచలత్పంకే మహీమండలే
నృత్యంతి గతశంక మంచితగతిః కీర్తి స్సపంకం పదం
బింబే చంద్రమసో నిధాయ తరసా రోహత్పదంబ్రహ్మాణ
స్తత్పంకాంకితదేహఏవ గగనే నూనం కలంకీ విధుః
పుత్ర స్తస్య నృసింహస్య భాతి సుత్రామవిక్రమః
అమిత్రౌఘతమోరాశే ర్మిత్రో మాధవనాయకః
అనుజో మనుజేంద్రస్య దనుజారాతిసంపదః
అన్నపోతమహీశస్య సన్నతారిమహీపతేః. ౧౫
నృసింహసంభవో యస్మా దసౌ మాధవనాయకః
అహితద్విరదారాతిబిరుదాంకయశోంబుధిః ౧౬
ధీరం తర్జనగర్జితోంబరగత స్త్వత్ఖడ్గధారాధర
శ్యామ శ్శత్రుశిరఃకపాల కరకోంక్తోరుధారాజలః
సంతుష్టాత్మమహీప్రజః ప్రతిఫలత్సూర్యాంశువిద్యున్నిభో
భూమా దగ్రితవైరిణాం ప్రతిదినం ప్రాణాంకురోద్భేదకః

ఉగ్రం సముత్క్షేషు రణేషు పూర్వం
తతో రమాయా రమణం రిపూణాం
ధాతార మంతే శరణాగతానాం
మన్యే త్రిమూర్తిం భువి మాధవేన్ద్రమ్. ౨౦
సప్రద్యుమ్నబలోద్ధతో నరకజి త్సత్యానురక్త స్సదా
ధర్మైకప్రవణక్రియాపరమయాయుక్త స్సుభద్రానుజః
ఏవమ్మాధవతః పురాణపురుషా న్నాన్యో నృపో మాధవో
వైషమ్యం త్విద మస్యయ త్సవిజయే యుద్ధే సహాయాయతే
భాతినారాయణోదారః ఖడ్గనారాయణో నృపః
ప్రత్యక్షమపి య స్యైద మ ప్రమాణం యశో భువి. ౨౧
నిత్యం విష్ణుపదాలంబీ ద్విజరాజః కలానిధిః
సంపూర్ణమండలో రాజా నకలంకికధోప్యసౌ. ౨౩
త్వమైకాధారభూతోఽపి బాహు ర్యస్య మహీపతేః
ఛినత్తి విమతవ్రాతశిరాంసి సతతం భువి. ౨౪
వర్ణ్యతే మహితే దానే కేన మాధవభూపతిః
యే నార్థినో నృపా భూమా కృతా నృపతయోఽర్థినః
ప్రత్యర్థిగాయగోగాళ స్సోయం సమరసాత్యకిః
శ్రీశైలవింధ్యమధ్యోర్వీమండలం పరిపాలయన్.
దత్యంకార్కశకాబ్దశాలిని శివే వర్షే నవే ఫాల్గునే
మాసే దాచయసింగభూపతిసుత శ్రీమాధవో భూధవః
శ్రీశైలోత్తరతోరణే భువి మహేశస్యాలయం నూతనం
పాషాణైస్సుదృఢం సురాసురనుతం గమ్య మ్ముదాచీకరత్.
నిశ్శేణ...దభంగ రసానతలమోపాన్సోపానమార్గందృఢం
శైలందిక్షుమహేశ్వరస్యచగృహం శ్రీమాధవేనాతతమ్.
ఇంద్రాద్యాఃకిల నిర్జరాభువివయం నోమాధవో నిర్మితా
దైవేనేతి వినమ్రవక్త్రకమలా శ్చింతాం శ్రయ న్తేపరామ్.

మాధవో వర్ణ్యతే యేనదిలీప సలనాహుషైః
అకృతం సుకృతం యేన కృతాసుకృతినా కృతమ్.
పదవాక్యప్రమాణేషు ప్రవీణేన వినిర్మితమ్
శాసన మ్మాయసుధియా స్థేయా దాచంద్ర తారకమ్.
శ్రీమతో మాధవేంద్రస్య రాజ్యాంగైకధురంధరః
మంత్రీ పోతనా మాపి త్సర్వశాస్త్రవిశారదః
యస్యామాత్యశిఖామణేః కవివరస్తోత్రైకపాత్రీకృతాం
మత్వా వాక్పతి రద్ధసతిసుభగాం వాగ్వైఖరీం లజ్జతే
సోయం పెద్దనమంత్రివర్యతనయః శ్రీపోతరాజోన్వహాం
దేవస్యాస్య మహోపకారరచనాం సమ్యఙ్మదాచీకరత్.
శ్రీగిరినాథాయనమః

సంత్వన్యేపి గిరౌగిరౌచ విబుధాః కక్షేషుకుక్షింభరి
క్షీబక్షీబతరక్షుభక్షణ భయత్యక్తా విరక్తాశ్రమాః
తేసర్వేనిజ...సిర్జరధునీ నీరాక్తచంద్రాతప
స్మేరోమానయనోత్పలోత్సవ సురాధీశో మహేశోనుకిమ్
గజాసురేంద్రకుంభకూటనాటనాతిపండితం
సురాసురేంద్రమౌళిహీరరంజితాంఘ్రి పంకజమ్
కళాధరోరగాధినాథ భూషితోత్తమాంగకం
సదాభజే మనోభవారి మంబికేశ మాదరాత్.

ఈశాసనములు వ్రాయింపవచ్చి వంగూరు తిప్పయభట్లు దేవతాస్తుతిగాను జెక్కినశ్లోకాలు ఈరెంకును.

శ్రీ శ్రీ శ్రీ పెద్దిరాజుకొడుకు పోతురాజువ్రాలు.

మన్యేమాధవమంచితాంగమహితా శాశాసితోగ్రప్రభం
యత్రాయిప్రకటార్థిరాగమవిధిజ్ఞై స్సజ్జనైః కృత్స్నశః.
దత్వాసూన్యధి పత్రిణోయమరయోజానంతి సంతంజయే

యే నేంద్రమ్మహసా యమంచదళితాభం భూరిశ స్సాదయే
చక్ర బంధోయంశ్లోకః.

ఈశాసనమునం దొలుత నాంధ్రభాష నీయాంశము సూక్ష్మముగఁ దెలుపఁబడినదో యాయాంశమే సంస్కృతశ్లోకములందు వివరింపఁబడినది. తెలుఁగువచనమున బిరుదాంకితుఁడు దానసింగభూపతిసుతుఁడు నగు మాధవభూపాలుఁడు మాధవపురమున రాజ్యమేలుచు పై శాసనమును నిర్మింపఁబూని మాయభట్టోపాధ్యాయునిచే రచింపించె నని కలదుగదా. ఆయాంశ మంతయు శాసనములోని 30 శ్లోకములలో సమగ్రముగ వర్ణించి శాసనరచయితయగు మాయభట్టోపాధ్యాయుఁ డీశాసన మాచంద్రార్కముగ స్థిరమగుఁగాకయని యాశించుచు శాసనమును ముగించినాఁడు. ఇక్కడకే శాసనస్వరూపమంతయు పూర్తిగ ముగిసినది. ఆవెనుక నీపోతరాజుమంత్రిఁ గూర్చిన శ్లోకములు, మూడవచ్చిన తిప్ప భొల్లు చెక్కించిన స్తోత్రశ్లోకములు, పోతరాజు బిరుదాలు, అను నక్కర ములు మాధవప్రశంసాత్మకమైన చక్రబంధశ్లోకము గానవచ్చుచున్నవి. ఇవన్నియు నీశాసనమునకు సంబంధించని యంశములే. సాధారణముగ తామ్రశిలాశాసనములలో దేవతాస్తుతి, శాసననిర్మాతయొక్క వంశావతారము, శాసనప్రయోజనము, స్వరూపము, శాసనము రచించునాతని పేరును వెలయుచుండును. వీనిలో నేవియుఁ గొన్ని లేకుండుటయుఁ గ్వాచిత్కముగా నుండును. కాని శాసనస్వరూపము ముగిసినపిమ్మట నాశాసనమునకు సంబంధించని యితర వ్యక్తులప్రసంగ ముండఁబోదు. ముప్పదియవ శ్లోకముతరువాతివిషయమంతయు నీశాసనమునకు సంబంధించనిదియే.

మఱియు వెలుగోటివంశచరిత్రమునఁ జూపిన శాసనపుఁబ్రతిలో ముప్పదియవ శ్లోకముతరువాత నున్న శ్లోకములకుఁ క్రమసంఖ్య గానరాదు. అట్లంకెలు లేకుండుటయు నీ తరువాతి శ్లోకము లాశాసనమునకు సంబంధించనివని సూచింపఁ దెలుపుచున్నది.

మఱియు "సీ వెలుగోటివంశచరిత్రమున నాయాభూపాలురకాలమును దెలుపుటకు వారివారి శాసనముల నెఱుకపఱుచుటయేగాక వారివారిపేరులతోఁ గూడిన శ్లోకములను గూడ చరిత్ర కుపయోగించుటకై సంగ్రహించి యున్నారు. ఈశాసనముతుది నున్న చక్రబంధశ్లోక మట్టిది కాఁగదా ? కావుననే రెండవసింగభూపాలుఁడు నెలకొల్పిన శాసనములు లభింప నందున నాతనిచరిత్రము నెఱుకపఱుచుటకై యాతఁడు రచించిన రసార్ణవసుధాకరమునందలి శ్లోకముల నాయనుబంధమున వెలువఱిచి యున్నారు. ఇటులనే నాయాభూపాలురకు సంబంధించిన సనదులను గూడఁ జేర్చియున్నారు.

ఇఁక నిచ్చట మాధవునియొద్ద మంత్రిగా నుండిన పోతరాజును గూర్చి తెలుపు పై రెండుశ్లోకములు మాధవనామాంకితములుగాన నీశాసనమున కనుబంధముగాఁ గూర్చియుందు రని తెలియవచ్చుచున్నది. లేకున్న శాసనస్వరూప మంతయు ముగిసినపిదప నీశ్లోకము లట నుండుట కేమియు నక్కఱ గానరాదు. ఇంతకును శాసనము చెక్కఁబడిన చోటికిఁ బోయి, యచ్చటి శిలలందలి శాసనాక్షరస్వరూపమును బాగుగఁ బరిశీలించి, యథార్థమును గ్రహింపనంతవఱకు నీశ్లోకముల నూఁతగఁగొని పెద్దన పోతరాజీమాధవునియొద్ద మంత్రిగ నుండె ననుట సాహసమాత్రమే యగును.

“ హరిశ్చంద్రనవనాథచరిత్రలందు గౌరన పేర్కొనిన సింగయమాధవుఁడు మొదటిసింగభూపతి కుమారుఁ డయినమాధవభూపాలుఁడగుటవలన గౌరనకాలము ఇంక కొంచెము వెనుకకుపోవుచున్నది” అని చెప్పుచు శర్మగారు నవనాథచరిత్రమునకుఁ గృతిభర్తయైన శాంతభిక్షావృత్తి యతీశ్వరునిఁగూర్చి యించుకైనను బ్రసంగింపరైరి. ఈశాంతభిక్షావృత్తియతీశ్వరుఁడే తనభృత్యుఁ డయినముమ్మడి శాంతయ్యకు శ్రీనాథునిచే శివరాత్రిమాహాత్మ్యమును గృతిగ నిప్పించినట్లు ఆమాహాత్మ్యమునందలిపీఠికాపద్యములవలనఁ దెలియుచున్నదిగదా! మాహాత్మ్యమునందుఁ

చేర్కొనఁబడినశాంతభిక్షావృత్తియతీశ్వరుఁడును, నవనాథచరిత్రమునందుఁ జేర్కొనఁబడిన యాతఁడును వేర్వేఱుపురుషు లని స్వప్రమాణముగ నిరూపించుటకుఁ దగిన యాధారము దొరకనంతవఱకు నిద్దఱు పురుషు లొక్కరేయని యూహించుటకు బాధక ముండదు గదా. అట్టిచో నీశాంతభిక్షావృత్తియతీశ్వరుఁడు శ్రీనాథునికి సమకాలికుఁడై క్రీ. శ. 1440 ప్రాంతమునందున్నవాఁడగును. అతనియనుమతిని నవనాథచరిత్రమును రచించిన యీగౌరనయు నాకాలమునాఁటివాఁడే యగు ననుటకు సంశయింప నక్కఱలేదు.

కావున, గౌరన తనలక్షణదీపికలో చమత్కారచంద్రికనుండియు రసార్ణవసుధాకరమునుండియు శ్లోకముల నుదాహరించుటచేతను, నవనాథచరిత్రమును శ్రీనాథునకు సమకాలికుఁ డగుశాంతభిక్షావృత్తియతీశ్వరు నాజ్ఞచే మల్లికార్జునునకుఁ గృతినిచ్చుటచేతను, పోతరాజునుగూర్చి తెలిపినశ్లోకము లాశాసనమునకు సంబంధింపని వగుటచేతను, శర్మగారనుకొనినట్లు గౌరనకాలము కొంచెము వెనుకకుఁ బోవుటకు బదులుగా ముందునకే వచ్చును. అతఁడు క్రీస్తుశకము పదునాల్గవ శతాబ్ది అంతమందుండుట యెట్లును బొసఁగదు. కావున క్రీస్తుశకము పదునేనవశతాబ్ది పూర్వార్ధమున, అనఁగా క్రీ. శ. 1400 మొదలు 1450 వఱకాతని కాలమయి యుండును.

శ్రీ నేలటూరు వెంకటరమణయ్య ఎమ్. ఏ. గారు 'గౌరన' అను వ్యాసమున నీతనికాలమునుగూర్చి యిట్లు తెలిపియున్నారు.

"సింగనమాధవుఁడును నతని మంత్రియగు పెద్దన పోతురాజును శా. శ. ౧౨౫౮ లో నుండిరని యుమామహేశ్వరశాసనమునందలి "దంత్యంకార్కశకాబ్దశాలిని" ఇత్యాదిశ్లోకము విదితము సేయుచున్నది. మఱియు శాసనాంతమునఁ బెద్దన పోతురాజు వ్రాలు గానవచ్చుచున్నది. "ఈశాసనము వ్రాయింపవచ్చి వంగూరితిప్పయభట్లు దేవతాస్తుతిగాను చెక్కినశ్లోకాలు ఈ రెండును శ్రీ శ్రీ శ్రీ పెద్దిరాజుకొడుకు పోతు

రాజు వ్రాలు." ఇంక సింగన మాధవుఁడును నరసిమంత్రియును పెద్దన పోతురాజును క్రీ. శ. ౧౩౭౬ వ సంవత్సరప్రాంతమున నుండిరనుట నిస్సంశయముగదా. పోతిరాజాత్మజుఁడగు నయ్యామంత్రియు నప్పటి వాఁడనుట నిశ్చయముగదా. అయ్యామంత్రికుమారుఁడును హరిశ్చంద్ర నవనాథచరిత్రలకర్తయునగు గౌరన క్రీ. శ. ౧౩౯౦, ౧౪౧౦ ల ప్రాంతమున గ్రంథరచనకుఁ గడంగెనని యూహింపవచ్చును. అతఁడు క్రీ. శ. ౧౪ వ శతాబ్దాంతమువాఁడగునుగాని వీరేశలింగముపంతులుగారు చెప్పినట్లు ౧౫ వ శతాబ్దమధ్యకాలమువాఁడు కాఁజాలఁడు". శ్రీ వెంకటరమణయ్యగారి యభిప్రాయమునకును శ్రీ శర్మగారి యభిప్రాయమునకును భేదమించుకయుఁ గానరాదు.

గౌరనతండ్రిని 'అయ్యనమంత్రి' అని పేర్కొని హరిశ్చంద్ర చరిత్రమునం దట్లు సంస్కరించియున్నారు. వీరి కీపాఠ మెట్లు లభించినదో? శర్మగారు నవనాథచరిత్రకృతిపతియగు శాంతభిక్షావృత్తిని బేర్కొనలేదు. వీరాతనిఁ బేర్కొనియు శివరాత్రిమాహాత్మ్యమునం దుదాహృతుఁడును, నవనాథచరిత్రమునం దుదాహృతుఁడును వేర్వేఱుపురుషు లనినారు. అట్లనుటకుఁ దగినయాధారములను మాత్రము తెలుపరైరి. శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారి షష్టిపూర్తిసంచిక వెలువడి సుమారొకవత్సరము గావచ్చుచున్నది. అందు శర్మగారు తెలిపిన యుపపత్తులనే, అం దుదాహరించిన శాసనములనే యాధారముగఁ జేసికొని వీరిట్టికాలనిర్ణయమును జేయుటచూడ విచిత్రముగఁ దోఁచుచున్నవి.

శర్మగారి యభిప్రాయమును విమర్శించియుంటినిగాన ఆహేతువులచేతనే శ్రీ వెంకటరమణయ్యగారి సిద్ధాంతమును గతార్థముగుటఁ జేసి యింతకెక్కుడు వ్రాయనక్కఱలేదని పాఠకులకుఁ దెలుపుచు నింతటితో విరమించుచున్నాఁడను.

---

చూ. భారతి. చిత్రభాను-శ్రావణము-పుట 96-100.